శ్రీకృష్ణ.

16

వార్ధకము.

वार्धकमु



Sri Rangarya Villasa Press Bobbili. 1918

## శ్రీ కృష్ణ.
## వార్ధకము.

---

వార్ధకదశలో జనులకుగల మేలుకీళ్లను బాగుగ
శోధింపవలసియున్నది. ఈయవస్థయనునది యేబ
దియయిదు, లేదా అరువది సంవత్సరములమీద శ
రీరస్థితులనుబట్టి తరుచుగ సంభవించుచుండును-అ
ప్పుడు శరీరస్వభావమునుబట్టి జ్ఞానేంద్రియములలో
నొకదానికిగాని యంతకన్న హెచ్చువానికిగాని యప
పాటవము గలుగుచుండును-శరీరదార్ఢ్యము తగ్గుచుం
డును-జ్ఞానేంద్రియము లన్నిటికిని బలము క్షీణించు
చుండినను, అందులో గొన్నిటికి హెచ్చుగ క్షీణదశ
వచ్చును. అందు త్వక్జిహ్వాఘ్రాణములశక్తి తగ్గిన
ను అంతగ లోపము గానరాదు. వయస్సులోసహా త్వ
గింద్రియమునందు లోపముగలవారు మొద్దువారుగ
నుండును. చక్షుశ్శ్రోత్రములయొక్క క్షీణదశమిగుల
శ్రమకరముగ నుండును. ఈ రెంటిలో చక్షుస్సుయొ
క్క క్షీణదశ నిండులోపమగుటయే కాక యాపయి
ని జీవించుట ప్రారబ్ధానుభవము కొఱకుగానే యేర్ప

దును-పండ్లూడిపోవుచుండును-లేదా భోజనపదార్థ
ములను బాగుగ నమలుటకు వీలులేకుండనైన నుం
డును. శరీరమందొక విధమైన ముసలివాసన వేయ
నారంభమగును- చర్మమునందు ముడుతలు కనబడు
చుండును- తరుచుగ గనబడు శైత్యపైత్యాజీర్ణాదు
లు స్వల్పకాలములో నివృత్తి నొందక యెక్కువ కా
లము బాధించుచుండును-ఈయవస్థలో యౌవనవతి
యగు భార్యయుండినచో నామెమనస్సునందు గుం
దుచుండును-కుమారులు మొదలగువారు తనవయ
స్సు హెచ్చుచుండు కొలది గౌరవముగజూడక నిర్ల
క్ష్యము జేయుదురు- మనశాస్త్రములలో నలుబది
సంవత్సరములమీద వివాహమాడగూడదని చెప్ప
బడి యున్నది- ఆనిబంధన లనేకసహస్ర సంవత్సర
ముల క్రిందట పుట్టియున్నవి- అప్పటివారి శరీరదా
ర్ఢ్యములకు నిప్పటి మనదార్ఢ్యములకును జాల వ్య
త్యాసము గలదు-మన తాతతండ్రుల దార్ఢ్యము మ
నకు లేదుగదా? కావున ముప్పది,లేదా ముప్పదియై
దు పయిని కళత్రాంతరమును స్వీకరించవలసి వచ్చి
న యెడల బాగుగయోచించవలెను-అప్పటికి పుత్రు

లుండినచో ప్రతివారును తప్పక వివాహముచేసుకొ
నవలెను-పుత్రులు లేనివారు తనసోదరులకుగాని స
న్నిహిత జ్ఞాతులకుగాని దృఢశరీరముగల పుత్రులుం
డిన యెడల వివాహమునూని వారిలో నొకరిని పెం
చుకొనవలెను-అట్లు లేనివారు తమశరీరస్థితిని బా
గుగ యోచించవలెను-అనగా శరీరదార్ఢ్యము గలిగి
మేహాదిరోగ వ్యాధులు లేనిచో నలుబది వత్సరములలో
పల వివాహమాడవచ్చును-ఆయుస్సుకు పైని వివా
హమాడక పుత్రులులేనివారు దత్తస్వీకారమును చే
సికొనుట సముచితము-

వృద్ధులను మూడు విధములుగ విభజింపవచ్చును.

1. సామాన్యులు-వీరు పయినిగనబరచిన యవస్థల
లో దేనినిగమనింపక యధాప్రకారముగ దిరుగుచుం
దురు. వీరికి పరమార్థవిషయమునందు లేశముబుద్ధి లేక
పోయినను తృప్తిగలిగి మామూలుగ గాలముగడుపు
చుందురు.

2. రెండవరకము వారికి, పిచ్చి, చీకాకు, కో
పము, ఆశ క్రమముగ హెచ్చుచు తమకుమనస్వాస్థ్య
ములేకయు నింటిలోని వారికందరకిని బాధకరులయ్యె

నుందురు- వీరు మొదటితరగతిలోనివారికంటె తక్కు-
వవారుగనెంచబడుదురు.

3. అరుదుగగొందరు, అరిషడ్వర్గమును జయిం
చుచు తమయుత్తరగతిని యోచించుకొనుచు కాల
నియమముగలిగి, యింటివారికి బాధకరులుగాకయు,
పరిచితులకు యుక్తాయుక్తప్రవర్తనలు చూపుచు తెలి
సికొని నడువదగినవారికి బుద్ధులుచెప్పుచు తృప్తిగలి
గి కాలమునుగడుపుచుందురు.

మానుజులకు గలసామాన్యానందములెవ్వియన,
ఆటలు, పాటలు, శరీరపరిశ్రమ, మంచిభోజనము, వేష
ము, బిడ్డలతోను స్త్రీలతోను మిత్రులతోను సంభా
షించుట, అరుదుగ సంగీతమునందభిరుచియు, నయి
యున్నవి. విద్య సత్ప్రవర్తనగలవారలకు పండిత సం
భాషణ, శాస్త్రచర్చ, క్రొత్తగ్రంథములు చదువుట
వ్రాయుట, తమకుగలదానితో తృప్తినొందుట, య
యి యున్నవి- వార్ధకములోనివారలకు సామాన్యా
నందములలోనిఆటలు, పాటలు, శరీరపరిశ్రమ, మం
చిభోజనము, నుండవు.మంచివేషమునందిచ్ఛ యుండ
దు.ముసలివాడని బిడ్డలువెక్కిరించుచుందురు స్త్రీలు

అసహ్యపడుదురు-మిత్రసంభాషణానందము. సంగీతా
భిరుచి, మాత్రము నిలచియుండును. విద్యాసత్ప్రవర్త
నలు గలవారి యానందములు వార్ధకములో మార
చు- ఈయన్నిటిలోను మిత్రసంభాషణయందెక్కువ
యభిరుచియుండును- మిత్రులు రెండువిధములు

1 తటస్థమైనప్పుడు స్నేహమర్యాదలతో మాటా
డువారు. వీరు ఎడమైనప్పుడు స్నేహితులను స్మరించరు.

2 రెండవరకము వారు మానసిక స్నేహము గలిగి
యుందురు- వీరు స్నేహితులను తరుచుగ స్మరించుటయే
కాక చూడగోరుచుండుదురు- అట్టివారికలయిక యాప
త్తులలోనుండు తరుణములలో సహా సుఖజనకమై యుం
డును-అయితే మిత్రులొండొరులు వార్ధకములోనిక
వచ్చునంతవరకు సజీవులయియుండుట తరుచుగ తట
స్థించు-జీవించినను స్థలాంతరములయందు వసింతురు-
మరియువిశేషముగ జీవించినకొలది శాస్త్రచర్చ, కొ
త్త గ్రంథములువ్రాయుట, చదువుట, వీనియందుసమ
ర్థత తగ్గిపోవుచుండును-కుటుంబములో విపత్తులు తటస్థ
మగును-వీనివలని దుఃఖములు, విశ్వాసము, తృప్తి, కష్ట
వానివలనగాని మళ్లీబాటులోనికిరావు- కొందరికథా

ర్యావియోగముగూడనగును- దక్షతలేనివానికిది గొప్పలోపము-తదితరులంతగ దుఃఖింపనవసరములేదు- ఏలయన కుటుంబయజమానుడు గతించినపయిని యాయన భార్యయెడల పుత్రాదులు సహా తగినంత గౌరవమును జూపకపోవుటయేకాక యాదరణగను జూడరు.

అప్పటికి జీవనములోని యేసౌఖ్యమును నుండదు. కావున శక్తి తనమిగత జీవితకాలమును వ్యర్థము చేయ వలసివచ్చును- అందునుండి శరీరపోషణము యెవ్వరికి నితర సాహాయ్యము నపేక్షింపక స్వేచ్ఛగ దినుగుటకయి శరీరముఅలయకుండ మితముగపరిశ్రమచేయుచు, మితాహారియై కాలక్షేపముతో మిగతకాలమును గడుపుచు, నది తన జీవితకాలపర్యంతము సుఖము నిచ్చునో అట్టిదైవభక్తి నిష్ఠకుపది, శేషా ఇరువదియైదు సంవత్సరముల వయస్సునుండియు సంపాదించుచు, దానినే తరణోపాయముగ నాలోచించుకొనుచు వృద్ధిపరచుకొనుచు నుండినయెడల నదియే వార్ధకమునందు సుఖము నిచ్చుటయేకాక ముక్తికిగూడ గొప్పమగసాధనముగ నుండును

వైష్ణవమనగా

ఎవడు జీవసమూహమున కాధారమైయున్నాడో, ఎవడు జీవులచే బొందదగియున్నాడో, ఎవడు జీవులను కరుణచే దనసన్నిధిని జేర్చగలడో, ఎవడు చేతనాచేతనముల కంతర్యామియై యున్నాడో, ఎవడు మన ప్రవర్తనల గనిపెట్టుచు రక్షాశిక్షలను జేయుచున్నాడో, ఎవడు పరప్రభువో, అట్టి జగత్కర్తయగు పరమేశ్వరుడు-ఆయనయందు భక్తినిపైని చెప్పబడిన ప్రకారము వృద్ధినొందించుచు, ఇతరదేవతల నారాధింపక నిత్యమును యథోచితమగు పుండ్రమును ధరించు కాలమందు కేశవాదిచతుర్వింశతి నామముల నుచ్చరించుచు, తనకుపదేశింపబడిన, లేదా తనకాడుకలోనున్న భగవన్నామమును ఇరువదినాలుగు పర్యాయములకు తక్కువకాకుండ జపించుచు క్రమముగ తరించవలెను-విష్ణుభక్తులు ద్వయమంత్ర చరమశ్లోకములనుగూడ నిత్యానుష్ఠానములో నుంచుకొనవలయును-

జరయనునది శరీరస్థితులనుబట్టి మేబదియైదు లేదా, అరువది మొదలు ప్రారంభమగును-అప్పటినుం

డియు వ్రయునిశాసిన ప్రకారము తరింపువిధమును
వ్యక్తి చేయుమంతుమని యందరిని పదేపదే ప్రార్థించు
చున్నాడను.

శ్రీకృష్ణ దాసుడు.

